వెల :

ఒకరూపాయి పన్నెండు అణాలు.



బెజవాడ శ్రీరాజరాజేశ్వరీ నాటకమండలి వారగు

శ్రీయుత పి. సూరిబాబు — శ్రీమతి సి హెచ్. రాజేశ్వరి

తప్ప

ఇతరులు ఎవ్వరూ ఈ నాటకాన్ని ప్రదర్శింపరాదు.

తృతీయ ముద్రణము - ఆగష్టు 1951





*Lakshmi Power Press, Tenali.*

# సమీక్ష.

చిరంజీవి పి. సూరిబాబు కోరగా ఈ నాటకం వ్రాశాను. దీని తొలిప్రదర్శనం ఏలూరులో 1944 సం॥ అక్టోబరు 29 వ తేదీని జరిగింది. మొదటి అయిదు నెలల కాలపరిమితిలోనే ఈ నాటకం నలభైఆరుసార్లు ప్రదర్శితమైంది. ఈనాటకం ఇంత త్వరలో ఇంత బహుజనామోదాన్ని పొందగలుగుటకు ముఖ్యకారణం ఏమనగా—దీన్ని ప్రదర్శించుటలో సామాజికులు చూపిన కొత్తదనం - అనగా, శ్రద్ధ, కట్టుబాటు, సమిష్టిసహకారం (Team Work), ఉచిత రంగాలంకారాలు, అన్నిటికంటే ప్రశంసనీయమైనటువంటి క్రమశిక్షణ.

నేటి మన కిరాయినటులు 'కాంబినేషన్' అనే పేరుతో, అరాజకంగా ఆడుతూవున్న అరోచకపు ప్రదర్శనాలలను చూచిచూచి, విసుగెత్తివున్న ప్రేక్షకలోకాన్ని ఈ కొత్తదనం పూర్తిగా ఆకర్షించింది. ఇందుకు, చిరంజీవులు పి. సూరిబాబు, సి హెచ్. రాజేశ్వరి. కళాప్రియుల మన్ననలకు అత్యంతమూ పాత్రులు.

కళానైపుణ్యంలో మన ఆంధ్ర నటీనటులు ఏ ఇతరరాష్ట్రీయ నటీనటులకూ తీసిపోరు. కాని, మన నటులలో వ్యక్తిత్వం బలిసి, సహకారం సమసిపోయింది. ఉదరారాధనావేశం వారి హృదయాలను ఆక్రమించింది — కళారాధనావేశం మాటుకు పెదవులను దాటలేదు. ఇది నిజం—కాబట్టి నిష్ఠురం !!!

ఉదరం మొదట—కళ తర్వాత: ఒప్పుకుంటాం. ఆకలిముందు—అభినయం తర్వాత, నిజమే. కాని, పొదుగు ముందు—పాలు తర్వాత ! మరి, పొదుగుకోసి పాలు తాగుతున్నారే మన కిరాయనటులు !! చిల్లర నటుల సంగతి అలా వుంచండి- ఆంధ్రనాట్యకళ తమలో మూర్తీభవించునట్లు చెప్పుకుంటూ, భీకర బిరుదాలను ధరించ ఒక్కొక్క ఆటకు రెండువందలు రూపాయలు కిరాయి తీసుకుంటూవున్న మన ఒకటో తరగతి నటులగూర్చి ఏమనాలి ?

నాటకప్రదర్శనం సర్వాంగసుందరంగ ఉండాలంటే, దానిలో పాలుగొనే నటులలో సమిష్టిసహకారం ఉండాలి. సమిష్టిసహకారం ఉండాలంటే ఒక స్థిరమైన సమాజం ఉండాలి. ఇది అందరికీ తెలిసిన సత్యమే ! కాని ఆచరణలో పెట్టగలిగిన వారు ఆంధ్రదేశం మొత్తంమీద ఇప్పుడు ముగ్గురే కనబడుతున్నారు—వారిలో ప్రథములు, బందరు వాస్తవ్యులైన శ్రీయుత డి.వి. సుబ్బారావుగారు; ఇప్పుడు శ్రీయుత పి. సూరిబాబు. శ్రీమతి రాజేశ్వరి డి. వి. సుబ్బారావుగారు చిత్తశుద్ధిగల కళారాధకుడు కాబట్టే, స్వయంగా ఒకసమాజాన్ని నిర్మించుకొని, దానిని పెక్కేండ్లనుంచి పట్టుదలతో నడుపుతూ, కిరాయనటులచేత అనుక్షణం ఖూని చేయబడుతున్న ఆంధ్ర నాట్యరంగానికి ప్రాణప్రదానం చేస్తున్నాడు. ఆయన చేస్తున్న ఈ సేవ ఆంధ్రనాట్య కళాప్రియులు ఎన్నటికీ మరువరాని సేవ. వారి తర్వాత ఇప్పుడు మా సూరిబాబు మా రాజేశ్వరీ తమ రాజేశ్వరీ నాటకమండలి ద్వారా చేస్తున్న కృషి మిక్కిలి శ్లాఘనీయం.

సమాజం లేకుండా, సమిష్టిసహకారం లేకుండా, క్రమశిక్షణలేకుండా, ఉచిత రంగాలంకార సామగ్రి లేకుండా, 'కాంబినేషన్' నటులు ఆడుతూవున్న అ

అరాజకపు నాటకాలను ఇన్నాళ్ళూ ఎలా సహించి ఊరుకున్నాం? జవాబు సులభం. ఇంట్లో దోమల్ని వీధిలో మురికినీ ఎలా సహించి ఊరుకున్నామో, అలాగే వీటినీ!

మన హిందూమనస్తత్వంలో అహింసాసహనమూ వేళ్ళు పాతుకుని ఉన్నాయి. ఈ రెండూ మన జాతికి అలంకార ప్రాయాలనీ, విశాల ప్రపంచములో ఈ రెంటికీ మనదే అగ్రస్థానమనీ, మనకు మనం సంతోషించటం కద్దు—ఖండాతరవాసులు కూడా మనల్ని పొగడటం కద్దు. కాని, మన అహింస దుర్బలత్వంలోకి, మన సహనం జడత్వంలోకి దిగజారినప్పుడు, జాగృతికి వేళ అయిందని తెలుసుకోవాలి.

శేషం వెంకటపతి రచించిన తారాశశాంకములోని పద్యాలలో కొన్నిటిని తూచాలు తప్పకుండా, కొన్నిటిని అక్కడక్కడ సవరించి, ఈ నాటకరచనలో నేను ఉపయోగించుకున్నాను. ఆ పద్యాలకు “ ” ఈ విధమైనగుర్తులు ఉంచాను.

ఈ తారాశశాంక నాటక రచన నన్ను చాలా కష్టపెట్టింది. ఎందుకంటే శేషం వేంకటపతి రచించిన కథావిధానాన్నిబట్టి, ఈ కథయెడల ప్రజానీకంలో ఒక హేయభావం పాతుకుపోయింది. ఆ హేయభావాన్ని తొలగించి, కథయెడలా అందరి పాత్రలయెడలా ప్రేక్షకులకు సానుభూతి కలిగేటట్లు రచించడమంటే. ఏటికి ఎదురీదడమే అయింది. ! ! ఎంతవరకు నాకృషి ఫలించిందో ప్రేక్షకమహాజనులే నిర్ణయింతురుగాక !

బెజవాడ,
ఆగస్టు 1951

— కొప్పరపు సుబ్బారావు.

---

# తారాశశాంకము పాత్రలు

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| బృహస్పతి | తార |
| అత్రి | శాంత |
| శుక్రుడు | అనుమాయు |
| నారదుడు | |
| చిన్న చంద్రుడు | |
| చంద్రుడు | |
| లంబోదరుడు (లంబూ) | |
| జంబుకేశ్వరుడు (జంబూ) | |
| మాతలి | |
| కొందరు శిష్యులు | |
| పటువులు వగైరా | |

# అంకం ఒకటి

## దృశ్యం ఒకటి

### అత్రి ఆశ్రమం.

అత్రి అనసూయ వటువులు ఇతరమహర్షులు పురోహితుడు ఉన్నారు. ఉపనయనం అయిపోయింది. ఋషులు ఆశీర్వాద మంత్రాలు చదువుతున్నారు చదివినతర్వాత చంద్రునిమీద అక్షతలు జల్లుతారు. ఆటు పిమ్మట, అత్రి అనసూయ చంద్రుడు పీటలమీదనుంచి లేస్తారు.

ముందుకు వస్తారు.

అత్రి —నాయనా! చంద్రా! భగవత్స్వరూపులగు ఈ మహర్షులకెల్ల నమస్కరించి వారి అమోఘాశీర్వచనములచే పవిత్రుడవుగమ్ము!

అత్రి అనసూయలు చంద్రుడిచేత ఒక్కొక్క మహర్షికి నమస్కారం చేయిస్తారు. చంద్రుడు "వందేభగవన్!" అంటూ నమస్కారం చెయ్యగా "విద్యాసంపన్నోభవ!" అని ఒకరూ, "వినయసంపన్నోభవ!" అని ఒకరూ, "కీర్తిసంపన్నోభవ!" అని ఒకరూ దీవిస్తారు. అనంతరం—

అత్రి —అనసూయా!

శా. ఎన్నోనోములునోచి యాచిలుత న య్యీశప్రసాదంబుచేఁ
గన్నా పొంతయుఁబెంచినాము వడుగున్ గావించినామీవయిన్
గొన్నాళ్లేగురునొద్దకోయనిపి యీ కుఱ్ఱన్ సువిజ్ఞానసం
పన్నున్ జేయఁగ వేళవచ్చె, నీకఁబంపన్ మేలుగాదే సఖీ?

అన —ఈతడు విద్యావంతుడౌటకు మనస్సు ఉత్సహించుచున్నను వియోగప్రాప్తికి ఆరాటపడుచున్నది. నాథా! ఇప్పట్టున నావిన్నపమొండు కలదు.

అత్రి—ఎట్టిదది?

అన —బ్రహ్మర్షిచంద్రులును వేదవేదాంగ విద్యాపారంగతులును అగు మీరే ఉపాధ్యాయులరై ఈ కుఱ్ఱను సమస్తవిద్యాపరిపూర్ణునిగా జేయగలరు. అట్టిరొడ మరొక గురువునొద్ద కనుపనేల?

అత్రి —అనసూయా! తండ్రి యెంతటి విద్యావంతుడైనను తనయునకు గురువగుట శ్రేయస్కరము కాదని నా అభిప్రాయము. ఏలయనగా—

గీ. తండ్రి మోహము కొడుకుశ్రద్ధను నడల్చు;
శ్రద్ధసడలిన శిష్యుఁడు జడతఁ గాంచు;
జడుని చదువెల్ల నీటిపైఁ జమురుచుక్క;
తండ్రి సుతునొజ్జయౌటనర్థంబుగాదె?—

అన —అటులైన ఈ చిరుతకెవ్వని గురువుగా నిశ్చయించినారు ?

అత్రి —సకలవిద్యావాచస్పతియగు బృహస్పతినే వీని గురువుగా నుద్దేశించితిని. కుమారా ! చంద్రా !

చంద్ర —జనకా! అనుజ్ఞయేమి ?

అత్రి —విద్యాభ్యాసముకొరకై కొన్నాళ్లునీవు గురుకులావాసము చేయవలసి యున్నది. నాయనా ! విద్యకంటె శ్రేష్ఠమైన పురుషార్థము లేదుసుమా !

ఉ. "ఆరనిజ్యోతి, యక్షయమహానిధిఁ జూపు నవాంజనంబు, నూ
రారికివచ్చి తోడుపడనోపిన బంధువు, జ్ఞాతివర్గముల్
గోరని సొమ్ము, దేవ నరలోక వశీకరణౌషధం. బసా
ధారణమైనవిద్య, సుకృతమ్మునఁగాక లభించునే సుతా!"

చంద్ర —పితృదేవుల హితోపదేశములను శిరమ్మున ధరించుచున్నాను.

అన —నాయనా! దేవగురువైన బృహస్పతియే నీకు తగిన విద్యాగురువు. ఇక జాగు వలదు. ఆ సద్గురుని యాశ్రమమ్మునకేగి ఆయనను సందర్శించి వినయ వినమిత శిరస్కుడవై విద్యాభిక్ష నర్థించెదవుగాక. చంద్రా!—

ఉ. సేవలకెల్ల సేవ గురుసేవ; గురుండవ నొక్కడేసుమీ
దేవగురుండు గీష్పతి; తదీయముఖమ్మున విద్యనేర్చుచే
నీవుగడింపగాఁ దగిన నిక్కపు జీవధనమ్ము; పొమ్ము ! వి
ద్యావిభవుండవై యశమునంది రయమ్మున రమ్ము పుత్రకా!

చంద్ర —(మోకరించి) జనకా ! ఆశీర్వదించుము.

అత్రి —గురుశుశ్రూషాఫలసిద్ధిరస్తు.

చంద్ర —(మోకరించి) జననీ ! దీవించుము.

అన —సమస్తసన్మంగళానిభవంతు !

చంద్ర —(మోకరించి) మహర్షులారా ! అనుగ్రహింపుడు)

అందరు—యశస్వీభవ ! యశస్వీభవ !

అత్రి —నాయనా ! కొంతదూరమువరకు నేను తోడువచ్చెదనురమ్ము.

చంద్రుణ్ణి పంపిస్తూ

అందరూ కోరస్ పాట పాడుతారు. (1)

---

## దృశ్యం - రెండు

### బృహస్పత్యాశ్రమానికి పోయే ఒకతోవ

శాంతా లంబూ జంబూ ప్రవేశం.

జంబూనెత్తిమీద చితుకులమోపు వుంది.

లంబూనెత్తిమీద కూరగాయలమూట వుంది.

శాంతచంకలో నీళ్ళబిందెవుంది.

ఉతికి పిండిన తడిగుడ్డలుకొన్ని భుజంమీద ఉన్నయ్.

శాంత—ఇలా పెళ్ళినడకలునడిస్తే ఇవ్వాళ అమ్మగారిచేత చీవాట్లు మామ్మాటికీ నిశ్చయం.

జంబూ—ఈ వెధవమోపు చచ్చేటంత బరువుంది-తెలుసా?

లంబూ—ఈ కూరగాయల హిమాలయంక్రిందిఅప్పచ్చిలాగ అణగారిపోతున్నాను.

శాంత—నాకుమాత్రం తక్కువబరువుందా

లంబూ—ఆడవాళ్ళ జన్మపొడుగునా ఏదోవిధంగా బరువుమొయ్యక తప్పదులే.

శాంత—అంటే?

జంబూ—మొట్టమొదటనుంచీ ఒళ్ళుబరువూ—

లంబూ—తర్వాత ధర్మబరువూ—

శాంత—నోరుముయ్!

జంబూ—అనంతరం పిల్లలబరువూ—

లంబూ—అబ్బబ్బబ్బబ్బ! జంబూ! మెడవిరుచుకుని పోతూవుందిరా. కొంచెం సేపైనా విశ్రాంతి తీసుకోకపోతే ఇహ అడుగుసాగడం కల్ల. (కూరగాయలమూట దింపుకుంటాడు)

జంబూ—నా అవస్థా అలాగేవుందిలే (చితుకులమోపు దింపుకుంటాడు)

శాంత—(ఆగకుండా వెళ్ళిపోతూవుండగా)

లంబూ—శాంతా!

జంబూ—శాంతా!

లంబూ—ఒంటరిగా వెళ్ళవద్దు.

జంబూ—వానకురిసి దారిఅంతా జావజావైంది. జారిపోతేప్రమాదం.

లంబూ—అదీగాక, నిన్నటినుంచీ మన ఆశ్రమంచుట్టూ ఒకపెద్దపులి తారాడుతూ వుందని కోయవాళ్ళు చెబుతున్నారు.

శాంత—అమ్మయ్యో! నిజంగానా?

జంబూ—దాని గాండ్రింపు వినేదాకా ఆలాగే అనకమానవు.

శాంత—(నీళ్ళబిందె దింపుకుంటూ) రేపటినుంచీ నీళ్ళకోసం, నేను రానేరాను.

జంబూ—సమిధలకోసం నేనూ రాను.

లంబూ—కూరగాయలకోసం నేను అంతకంటే రాను.

శాంత—(కొంటెతనంగా) కాదు. నేను యధాప్రకారంగానే వస్తా.

లంబూ—అలాగైతే నేనూవస్తా.

జంబూ—నేనూవస్తా.
శాంత—(పకప్కన నవ్వుతూ) గొఱ్ఱెలమంద.
లంబూ—ఒరేయ్ జంబూ!
జంబూ—ఏంట్రా లంబూ!
లంబూ—మనల్ని గొఱ్ఱెలమంద అని దారుణంగా అవమానించింది. దిగమింగికూర్చోడం పురుషలక్షణమంటావా?
జంబూ—ఓసీ శాంతా! నువ్వు తారాదేవికి శిష్యురాలవైతే మేము బృహస్పతుల వారికి శిష్యులం జాగ్రత.
లంబూ—అమ్మగారికంటే అయ్యగారు బృహస్పతి అనేకరెట్లు అధికం. తెలుసా?
శాంత—ఎందుచేత?
జంబూ—మగవాడు కావడంచేత!
శాంత—మీ బృహస్పతులవారిని నేను మగవాళ్ళజాబితాలో చేర్చలేదు. తెలిసిందా?
జంబూ—చెప్పవ్రా?! — అయితే, అప్పుడే ఒకజాబితా. లెక్కా. డొక్కా— భేష్ భేష్! ఇంతవరకూ వికసించిందా నీ బుద్ధి!
లంబూ—ఓరేయ్! పువ్వు పుట్టిన తర్వాత వికసించకుండా వుంటుందట్రా? అయితే ఒక్కటే భేదం. అసలు పువ్వులు భ్రమరచుంబనం అయిన తర్వాతగాని వికసించవు ఈ ఆడపువ్వులు వికసించిన తర్వాతగాని అనవు.
శాంత—(బుజంమీది తడిదోవతిని లంబూనెత్తిమీద పిండుతూ) నీ విద్యావైదుష్యానికి దేవతల అమృత వర్షం!
లంబూ—(తుడుచుకుంటూ) నన్ను ఎంత అవమానించినా సహిస్తాగాని నా విద్యను అవమానిస్తే సహించనుసుమా. అనేకసార్లు ఇలాగే హేళన చేశావు. ఇంకోసారి ఊరుకోను. హెచ్చరిక!
జంబూ—ఒరేయ్! ఒక్కసారి మన విద్యాపరాక్రమాన్ని ప్రదర్శిస్తేనేగాని దీనికి ఈ అహంకారం అణగదేమో?
లంబూ—ప్రదర్శించమా జంబూ!
జంబూ—అవశ్యము లంబూ!
లంబూ—(అమాంతంగా రౌద్రం తెచ్చుకుని) ఓసీ శాంతా! ఇదే అస్మదీయ ప్రచండ విద్యాపాండిత్యమును చవిచూచెదవుగాక! నిలు! నిలు!

"సీ. పొలతిరో! నీతోడ వలపు రహస్యముల్
తర్కించుచేసుమీ తర్కవిద్య
జంబూ—అంగనా! నీ వద్ద శృంగార శబ్దల
క్షణము నేర్చుటయె వ్యాకరణవిద్య
లంబూ—మగువ! నా మనసు నీ మనసులో నైక్యంబు
నొందించుటేసుమీ యోగవిద్య
జంబూ—తరుణీ! నీ యందచందములు కుల్కులు వగల్
సంఖ్య యొనర్చుటే సాంఖ్యవిద్య"

లంబూ— మోహినీ ! కోపభరమున మూసికొన్న
ముద్దు పెదవులు తెరచుటే మోక్షవిద్య

జంబూ లంబూ(కలిసి) వనితా ! మనమొక్కటౌటె యద్వైతవిద్య

జంబూ లంబూ(కలిసి) తన్వీ ! కాకున్న పాపిష్టి ద్వైతవిద్య.

పద్యం ముగిసేటప్పటికి శాంత నీళ్లబిందెను
చంకలో పెట్టుకుంటుంది.

శాంత—అమ్మాగారితో చెప్పి మీ యిద్దరి పొగరూ తీయించకపోతే నాపేరు శాంతకాదు. (అంటూ తుర్రున బయలుదేరుతుంది.)

జంబూ చితుకల మోపుసూ, లంబూ కూరగాయల మూటనూ నెత్తిమీద పెట్టుకుని శాంతవెంబడి ఈ దిగువ తత్త్వం పాడుతూ నిష్క్రమణం.

జంబూ—విద్యలన్నిటి తత్త్వమేమో విప్పిచెప్పర సద్గురూ !

లంబూ—విద్యలన్నిటి తత్త్వంమొకటే ప్రేమతత్త్వము శిష్యుడా !

జంబూ—ప్రేమతత్త్వములోని బ్రహ్మము తావు చెప్పర సద్గురూ !

లంబూ—ప్రేమతత్త్వబ్రహ్మ తావు భామ కుధరము శిష్యుడా !

ముగ్గురూ నిష్క్రమణం.

---

## దృశ్యం - మూడు

బృహస్పతి ఆశ్రమం వెలుపల వటచ్ఛాయలో-బృహస్పతి శిష్యవర్గంచేత
అధ్యయనం చేయిస్తున్నాడు—

శంనో మిత్రః శంవరుణః - శంనో భవత్వర్యమా -
శంన ఇంద్రో బృహస్పతిః - శంనో విష్ణు రురుక్రమః -
నమో బ్రహ్మణే - నమస్తే వాయో - త్వమేవ ప్రత్యక్షం
బ్రహ్మాసి - త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి -
ఋతం వదిష్యామి - సత్యం వదిష్యామి - తన్మామవతు -
తద్వక్తారమవతు - అవతుమామ్ -అవతు వక్తారమ్.

ఓం శాంతిః శాంతిః శాంతిః

(అప్పుడు చంద్రుడు ప్రవేశం)

చంద్ర—(ప్రవేశిస్తూ) విద్యాభిక్షామ్ దేహిమే! విద్యాభిక్షామ్ దేహిమే! అని బృహస్పతి ముందు సాష్టాంగపడును)

బృహ—చిరంజీవ! చిరంజీవ! లెమ్మా? బాలకా! ఎవరవునీవు ?

చంద్ర—(లేచి) భగవన్! అఖండ తేజోరాశియగు నత్రిమహర్షికిని జగదేకారాధ్యురాలగు ననసూయాదేవికిని పుత్రుడను. నాపేరు చంద్రుడు.

బృహ—సంతోషము. సంతోషము. చంద్రా ! నీపితృదేవుల యాశ్రమములో నెల్లరకు కుశలమా ?

చంద్ర—భగవన్ ! మీదయవలన నెల్లరకును క్షేమమే.

ఉ. "మాతలిదండ్రు లన్నలును మాహితులాప్తులుబంధుకోటిసం
ప్రీతిగనున్నవారచట, మీచరణాంబుజ సేవజేయ న
న్నితరిబంపగా నెలమి నేనిటవచ్చితి? నన్ను శిష్యునిన్
నీ తనుజాతురీతిని వినీతునిగా నొనరించి బ్రోవవే!"

బృహ—కుమారా! నాశిష్యుడవగుటకు నింతగా నుత్సహించుచుంటివా?

చంద్ర—భగవన్ ! మానవులకు దేవతలు గురువులు. దేవతలకు మీరు గురువులరు. అట్టిమీగురుత్వముకన్న విద్యార్థికి వాంఛనీయ మెందుకలదా ?

బృహ—కుమారా! నీ వినయము మాకెంతయు సంతసము కలిగించుచున్నది.

చంద్ర—భగవన్! నేటికి నేను కృతసంకల్పుడనైతిని.

ఉ. పావనమూర్తులాప్తులు కృపాపరతంత్రులు వేదవాదపుం
భావసరస్వతుల్ దివిజవర్గ నమస్యులు స్వీకరించు నా
దేవగురుల్ మహాత్ములు త్వదీయపవిత్ర పదాంబుజాత సం
సేవఁ బునీతుడై వరలు శిష్యునకున్ మరుజన్మముండునే.

బృహ—బాలకా! నీ వినయవివేకములు మాకెంతయు తృప్తి ఘటించినవి.

మ. "అనసూయానతి నీదుతల్లి, మునిరాజౌ అత్రి నీతండ్రి, త
జ్జననంబందిన నీకు నీవినయమున్ సౌజన్యమర్యాద వ
ర్తన మంచన్మధుకోత్తములన్ దలపవింతల్ గావు, రాజత్కళా
ఖనివై యొప్పెడినీవు శిష్యుడగుభాగ్యంబెన్న సామాన్యమే."

చంద్రా!

క. "పదునెనిమిది విద్యలు నినుఁ
జదివించెద, వేయునేల? జగముల నెందున్
బదులితనికి లేదనిపిం
చెద, నిను నాయంతవానిఁజేసెద చంద్రా!

చంద్ర—ధన్యోస్మి ! ధన్యోస్మి ! (సాష్టాంగపడును.)

బృహ—ఆయుష్మాన్భవ! (చంద్రుణ్ణి లేవదీసి తెరవైపు చూచి) ఎవరక్కడ ?

జంబూ } (ప్రవేశిస్తూ) చిత్తం గురుదేవా !
లంబూ }

బృహ —తార యేమిచేయుచున్నది ?

లంబూ—ఇవ్వాళ మాంచివాడుపైన మవ్వంకాయలు తెచ్చాను గురుదేవా !

జంబూ—ఇవ్వాళ దొరికిన కట్టెలుకూడా బహుదగ్ధయోగ్యంగా వున్నయ్. గురుదేవా!

బృహ—మాధులారా ! తార యెక్కడ ?

లంబూ—పూజామందిరంలో వున్నారు గురుదేవా ;

బృహ —మంచిది. చంద్రా ! పూజామందిరమునకేగి నీ మాతృశ్రీని సందర్శించె దవు గాక-రమ్మ !

(అందరూ నిష్క్రమణం)

---

## దృశ్యం – నాలుగు

బృహస్పతి ఆశ్రమాంతరంలో పూజామందిరం తార ఈశ్వరీపూజ చేస్తున్నది.

### తారపాట (2)

(పాటచివర బృహస్పతి చంద్రునితో ప్రవేశం)

బృహ —తారా ! ఈశ్వరీపదచింతనాసక్త మానసవైన నీ యేకాగ్రతకు భంగమొన రించినందుకు సైరింతువుగాక. ఇదే-ఈ బాలునిచూడుము !

తార —(చంద్రుని అలోకసామాన్య సౌందర్యాన్ని రెప్పవెయ్యకుండా చూస్తూ) ఎవరీతడు ?

బృహ —మన అత్రి అనసూయల పుత్రకుడు విద్యాభిక్ష నర్థించి మనవద్దకు వచ్చి నాడు. చంద్రా ! ఇకనుండి నీవు ఈమెయధీనము. (తారను (సంబోధించి)

ఉ. "నీరజగంధి ! వీడు జననీ జనకుల్ కడుగారవమ్మునన్
వారక పెంపగా బెటిగినాడతికోమలదేహుఁ డీతనిన్
మేరమెఱింగి యాదరము మీరగ వేళకు వేళకున్ మనం
బారసి యన్నపానముల కాకొననీయకుమా తలోదరీ !"

నాకు దేవతార్చనకు వేళ అయినది..చంద్రా ! మహుహూర్తమాలోచించి విద్యాభ్యాసమారంభించెదను. అంతవరకు ప్రయాణశ్రమము నపనయించు కొనుచుందువుగాక. తారా ! అనసూయాసాధ్వి నీ భుజస్కంధమున

మహాద్భారము విక్షేపించినది సుమా ! కుఱ్ఱవానిని కడుంగడు శ్రద్ధాదరము లతో జెంచి ఆమెవిశ్వాసమును నిల్పుకొందువుగాక. (నిష్క్రమణం)

చంద్ర —జననీ ! గురుదేవులు నాచేత మీకు నమస్కారము చేయించుట విస్మరించి నారు. ఇదే నా నమస్కారము.

తార —(రెండుచేతులూ పట్టుకొని) ఆగు ! గురువుగారికి చేసినప్పుడే గురుపత్నికిని జెందినది. (కొంచెం ఆగి)—నీపేరు చంద్రుడా !

చంద్ర —చిత్తము.

తార —చంద్రుడు......చంద్రుడు......శాంతా ! శాంతా !

శాంత —(ప్రవేశిస్తూ) పిల్చారా నన్ను ?

తార —ఈకుఱ్ఱవానిని చూచావా !

శాంత —ఎవరు ?

తార —మన అనసూయ కొడుకే—

శాంత —ఔను. విన్నా—అత్రిమహర్షి భార్య—

తార —వారిపుత్రుడు

శాంత —ఇక్కడికి కెందుకువచ్చాడు ?

తార —విద్యాభ్యాసనిమిత్తమట—

శాంత —మీదగ్గరనా ?

తార —మనదగ్గరే.

శాంత —ఎంతఅందంగా వున్నాడమ్మా !

తార —దిష్టి పెట్టకే !—పేరువిన్నావా ?

శాంత —అదికూడా అంత అందంగావుందా !

తార —చంద్రుడు ! —చంద్రుడు !

శాంత —ఎంతబాగుంది !

తార —చంద్రుడా ! ...ఇకరా ! మార్గాయాసంతో కొంతా, మా సంభాషణతో కొంతా నీకు విసుగు కలిగివుంటుంది.

చంద్ర—లేదు. జననీ! లేదు, మీ యాదరణ నా శ్రమనంతయు మరిపించినది.

శాంత —అబ్బో! చాలా వ్యాకరణయుక్తంగా మాట్లాడుతున్నాడే !

తార —నీ తుపానుఘాటికి ఈ లేతపూరెమ్మ నిలువనేరదుసుమా. జాగ్రత. చంద్రా ! చాలా జాగైంది. నీకు ఆకలై ఉండవచ్చు. రాపోదాం.

శాంత —అమ్మా ! ఈకుఱ్ఱవాణ్ణి నేను స్నానంచేయించి తీసుకువస్తాగాని మీరు వెళ్ళండి.

(లంబూ ప్రవేశం)

లంబూ—అమ్మా! మువ్వంకాయ ఘుమఘుమ మాడుకొనులదాకా కొడుతూవుంది, పనస చెడకముందే భాండీని దింపాలి. రండి !

శాంత —అమ్మా ! చంద్రుడి వ్యవహారం నేనుచూస్తా. మీరువెళ్ళరాదూ ?

తార —కాదు. నీవే వెళ్ళు.

లంబూ—ఇదెక్కడికర్మ! మావంకాయకూరమాడిపోతున్నదని మొత్తుకుంటూవుంటే ఇద్దరు గాడవాళ్లుండికూడా ఒక్కరూ కదలరేం? (చంద్రుడికేసి కోరచూపులు చూస్తూ) ఈ బుడత ఎవడో మాంచి రసకందాయంలో వచ్చిపడ్డాడే!

తార —అసభ్యంగా మాట్లాడకు. కాంతా! నీవుపోయి వంటపనిచూడు. లంబోదరా! నీవుపోయి నీళ్ళుకాగబెట్టు! ఎదురుచెప్పకర్దు. ఇది నాయాజ్ఞ!

(మొహాలు చిట్లించుకొని ఇద్దరూ నిష్క్రమణం)

తార —చంద్రా! ఇకపోదాం రా!......కానిఒకబాధ నన్ను వేధిస్తూవుంది నీవు నిజంగా చంద్రుడివి. మరి—చంద్రునికి ఆహారం అమృతం అది నేనెక్కడ తేగలను!

చంద్ర —అమ్మా! ప్రేమతో మీరొసంగు మంచినీరమైనను నాకు అమృతప్రాయమే.

తార —చంద్రా! శక్తివంచనలేకుండా నావిధి నిర్వర్తించుకొంటా. కాని, నా జీవితాకాశంలో నీలాటి బాలచంద్రుడొకడు ఉదయించగలడని కాని, ఈ విధంగా శీతవెన్నెల వెలుగు విరజిమ్మునని కాని కలలోనైనా అనుకోలేదు. రా!

## తారపాట (3)

## దృశ్యం – అయిదు

(పకపక నవ్వుతూ నారదుడు ప్రవేశము)

నార —తారా! ...ఏమంటివి ?..."నాజీవితాకాశములో నీవంటి బాలచంద్రుడొకడుదయింపగలడని కాని, ఈవిధముగా శీతవెన్నెల వెలుగులువిరజిమ్మునని కాని, కలలోనైన అనుకొనలేదు" అనియా!...ఔనౌను! తారా!

చ. అనుకొనలేదు నీవు హరిణాంకుడొకండు గలండటంచు, వా
డనుకొనలేదు తారయనునామె యొకర్తుక యున్నదంచు మీ
రనుకొనకుండ సంఘటితమయ్యెను చక్కనిఘట్ట, మింక నే
మనుకొననేమి! కాఁగలది యాటకే యీకథ వచ్చెఁదారలో!

నందనందనా! ఆర్తజనశరణ్యా! నీ సంకల్పములు దుర్జ్ఞేయములు! దురవగాహములు!

ఉ. ఆరువదుల్ వయస్సున బృహస్పతి కక్కట? పాలుకాఁగి చ
ల్లారెను; తార కీర్వది వయస్సాయినన్; నిజనాథ పాదసే
వారతి బ్రొద్దుపుచ్చుచుఁ బ్రపంచసుఖంబుల నెంచ; దట్టియా
తారకు నేడు చంద్రుడు దాపరమాటకు హేతువేముకో?

ఔను! చూడఁజూడ ఈఘట్టముకడుంగడు విషయగర్భితమైకన్పట్టుచున్నది దీనినిజాగరూకతతో కనిపట్టి కలహభోజనప్రాప్తికి వలయు నుపాయమ్ములు వెతకుటయే ఇక నాకు కర్తవ్యము. హేకృష్ణా! ద్వారకానిలయా!

నారదుని పాట

# అంకం రెండు

## దృశ్యం ఒకటి

బృహస్పతి ఆశ్రమం వెలుపల ఒక మార్గం.

లంబూ జంబూలు ప్రవేశం

లంబూ—ఒరేయ్! నువ్వూ నేనూ ఈ ఆశ్రమంలోనికివచ్చి ఎన్నేళ్లుగడచిపోయారో జ్ఞాపకంవుందా ?

జంబూ—చంద్రుడికంటే రెండుసంవత్సరాలేగా మనం ముందు వచ్చింది ?

లంబూ—చంద్రుడు ఈ యాశ్రమంలో అడుగుపెట్టి ఎన్నేళ్ళయింది ?

జంబూ—పద్దాను గేళ్ళు.

లంబూ—కాబట్టి మనంవచ్చి పదహారేళ్ళయిందన్నమాట. మరి పద్ధాను గేళ్ళనుంచీ అతడుచదివినచదువుకీ, పదహారేళ్ళనుంచీ మనందిచవిన చదువుకీ, ఎంతతేడా వుందో గమనించావా ?

జంబూ—గమనించకేం ?

సీ, తర్క-భాష్యముల విద్వాన్ బిరుం దతనికి,
వంటలో మనకు విద్వాన్ బిరుందు

లంబూ— లక్ష్యలక్షణాధనుర్లాఘవంబతనికి,
భక్ష్యభక్షణ కళాప్రౌఢిమనకు

జంబూ— గంధర్వ గానసంగతి వాసియతనికి,
వడ్లదంపుడుపాట వాసిమనకు

లంబూ— సకలపురాణార్థచర్చలు వానికి,
'శాంతా' పుర్రాణమే చర్చమనకు

జంబూ— చనవు గారాము ముద్దుముచ్చట లతనికి,

లంబూ— తిట్లు మెడనెట్లు మొట్లు చీవాట్లు మనకు,

జంబూ— మురిపెముగ బెంపబడ్డ పూమొక్క యతడు,

లంబూ— సంతవిడిచిన యాబోతు జంట మనము,

జంబూ—ఒరేయ్ ! మరోసంగతి గమనించావా ?

లంబూ—ఏమిటది ?

జంబూ—చంద్రుడు విద్యలో నేగాక విలాసాలలోకూడా పాండిత్యం సాధించడం సాగించాడు.

లంబూ—ఔనౌను గమనించా.

జంబూ—పద్దానుగేళ్ళ క్రితం ఆశ్రమంలో అడుగుపెట్టిన ఆ పిరికిచూపుల పాలబుగ్గల చంద్రుడికీ, నవయౌవన సౌందర్యాతిరేకంతో విర్రవీగుతున్న ఈ చంద్రుడికీ, ఎక్కడా పోలికే లేదుసుమా.

లంబూ—(రహస్యంగా) ఎలా వుంటుందిరా!—పూర్తిగా రెండావుల దూడయ్యాడు.

జంబూ—(రహస్యంగా) తారవిడిస్తే శాంత - శాంతవిడిస్తే తార.

లంబూ—అందు చేతనే దూడ బాగా కండపట్టి తోకయెత్తి నృత్యం చేస్తున్నది. అదిగాక ఒరేయ్! అందచందాల్లో చంద్రుడివంటి సుందరుడు లేక పోవచ్చుగాని, ఆశ్రమంలో వున్న ఆడవాళ్లందరికి ఇదేమి వేలంవెర్రో బోధపడకుండావుంది.

సీ. "కనురెప్పవెట్ట కాత జూచు నొక్కతే
చూచి యల్లన దలచూచి మెచ్చు—

లంబూ— మెచ్చులాడ వటంచు మెచ్చినవ్వు నొకర్తె
నవ్వుతో నగిరుక్కనను దొలంగు—

లంబూ— పయటచాటుగ నోరబరకించు నొక్కతె
బరికించి వానిదగ్గరకు బిలుచు—

జంబూ— బిలిచి యూరక ముచ్చటలనాడు నొక్కతె
ఆడి ఏకాంతమటంచు జేరు—

లంబూ— చేరి చెవిలోన గుసగుసల్ చెప్పినట్లు
మోము మోమున గదియించి మురియునొకతె"

జంబూ— ఇక్షుఖండంబుపై మూగు నీగలవలె
మురుసుకొని మోతవెట్టి రీ ముగుదలార!

లంబూ—ఒరేయ్! కందమూల ఫలహారమని కాషాయవసన ధారణమనీ సాత్విక జీవనమని ఋష్యాశ్రమ వాసమనీ యెంతో గొప్పగా మనం చెప్పుకోవడమే గాని ఆడామగా అనేవిషయం వచ్చేసరికి ఆది కిరాతులకూ మనకూ అంతగా భేదం కనపడదు సుమా.

జంబూ—సందేహమెందుకు? అందుకు సజీవ దృష్టాంతములుగా నీవూ నేనూ ఉన్నాం గదా!—............ఒరేయ్ చూడు చూడు ఆ దృశ్యం! (తెరవైపు చూపిస్తాడు)

లంబూ—(చూస్తూ) బలే రమ్యంగావుంది. చంద్రుడు ఒకలేడి వెంట పడ్డాడు శాంత ఆలేడిని పట్టుకొని ఒక పొదలో దాచేసి పారిపోతున్నది.

జంబూ—ఈ శాంతసంగతి మరీగల్లంతుగా వుంది సుమా.

లంబూ—చంద్రుడు వచ్చినది మొదలు ఇది మనల్ని పూర్తిగా విడిచిపెట్టేసింది.

జంబూ—ఔను. దీనికళ్ళకు ఇప్పుడు మనమిద్దరమూ రాహుకేతువుల్లాగ కనపడుతున్నాం.

లంబూ—చంద్రుడివెంట తిరగవద్దని అమ్మగారు ఎన్నిసార్లు దీన్ని మందలించినా ఎలాగో అవకాశంచిక్కించుకుని కుమ్మరిసారెలాగా అస్తమానం ఇతడి చుట్టే తిరుగుతూవుంటుంది.

జంబూ—చంద్రుడికి కూడా దీనివెంట తిరగడం చాలా సరదా అనుకుంటా.

లంబూ—ఒకేయ్ ! పరుగెత్తుకుంటూ ఇద్దరూ యిటేవస్తున్నారు. ఏంచేద్దాం ?

జంబూ—(ఆలోచనతో రహస్యంగా) అమ్మగారితో చెప్పి ఆమెను ఇక్కడికితీసుకు వచ్చి వీళ్ళయిద్దరికంతా ఒక్కసారి చూపించి, ఘాటుగా శృంగభంగ చేయిద్దాం. రా!—

లంబూ—బాగుంది ఈ ఆలోచన. నడు !

(లంబూ జంబూలు నిష్క్రమణం)

---

## దృశ్యం - రెండు

బృహస్పతి ఆశ్రమంలో వనం

శాంతను తరుముతూ చంద్రుడు ప్రవేశం

శాంతా చంద్రికలకు డైలాగ్ పాట (4)

శాంత —ఎందుకు ఇలా నా వెంటపడ్డావు ?

చంద్ర —నా లేడిని నాకిమ్మ

శాంత —నీ లేడా? నాకేం తెలుసు ?

చంద్ర —నీవే దానిని దాచితివి.

శాంత —నేనా ? యేదీ ? (ఒళ్లుదులుపుకుంటూ) ఎక్కడ ?

చంద్ర —సరే: పోనీ (వెళ్లిపోతాడు)

శాంత —చంద్రా ! (అడ్డంగా నిలబడి) వెళ్లనియ్యను.

చంద్ర —ఏల ?

శాంత —నాయిష్టం.

చంద్ర —శాంతా !—

శాంత —ఔను......చంద్రా ! చాలరోజులనుంచి నిన్ను కొన్నిప్రశ్న లడగాలని అనుకుంటున్నా. ఇవ్వాళ అడిగేస్తా—సరియైన సమాధానం చెప్పికవలు.

చంద్ర —కానిమ్మ. ఎట్టివాప్రశ్నలు ?

శాంత —తారాదేవి నీ కేమవుతుంది ?

చంద్ర —తల్లి.

శాంత —తల్లియా ? !...ఎన్నాళ్ళయింది ఆమె నిన్నుకని ?

చంద్ర —(కోపముతో) హాస్యమా !

శాంత —సీతల్లి అనసూయసాధ్వి కాదూ ?
చంద్ర —ఆమెకన్నతల్లి—ఈమెపెంపుడుతల్లి.
శాంత —ఓహోహో!
చంద్ర —ఔను శాంతా !
శాంత —బాగా యోచించే చెబుతున్నావా ?
చంద్ర —అవిధముగా ప్రశ్నించుటకు హేతువేమి ?
శాంత —ఉంది కాబట్టి అడుగుతున్నా.
చంద్ర —శాంతా! నీ మెదడు నందెట్టి యసహ్యపు టాలోచనలు కలలోనైనా రాకుండుగాక.
కాని నా మనోగతము నాలించెదవు గాక.

జనుడు మరల మరల జన్మమ్ము లెత్తుట
తప్ప దన్నమాట తథ్యమేని—
నూరుజన్మలెత్తి తారాసుతుండనై
పుట్టుసుగతి నాకు పట్టుగాత!—

శాంత —చంద్రా! ఆ తారాదేవి చేష్టలనూ హావభావాలను గమనిస్తున్నావా ?
చంద్ర —అంతగా గమనింపదగిన దేమియుండును !
శాంత —చంద్రా ! నీవు వట్టి వెర్రివాడవైనా కావాలి లేకపోతే మించి గడుసరి
వైనా కావాలి.
చంద్ర —ఎందుచేత ?
శాంత —నీకుతప్ప ఆశ్రమంలో అందరికీఆమెచేష్టలు చాలా విపరీతంగా కనిపిస్తున్నవి.
చంద్ర —నిజమా ? ఎట్టివవి ?
శాంత —ఎట్టివీఅంటే నేనేం చెప్పను ?... నేనూ ఆడదాన్నే !... అయినాచెప్తా.

చ. గడెగడ నీవు కన్నులకు గన్పడ కుంటివయేని తార తాఁ .
దడఁబడనేల! యున్నరని తారట లాడుచు నిన్నుఁబిల్వఁగా
బుడుతులఁబంపనేల! నినుబోలిన శిష్యులుగారె యెల్లరున్ ?
చెడిన మనస్సువృత్తులివి చెప్పగనేలను విప్పి చందురుడా!—

చంద్ర — (కోపంతో) శాంతా! ఇదియెల్ల నీకపోలకల్పిత కథానకము.
శాంత —గడుసుదనపు బిభీకలు చాలించి, ఇంకావిను. ఆమె, ఒకనాడు—

సీ. *జిలుగుచీర వదల్చి చెంగావి ధరియించి
యేదిబాగనుచు నిన్నేల యడిగె ?

చంద్ర —నన్నా? ! ఆమెయా ? ! ఎన్నడు ? !
శాంత —నేను చెప్పబోయేవన్నీ విని తర్వాత బూకరించు.

రైకనడల్చి యారజపుపైట ధరించి
యేది మేలనుచు నిన్నేలయడిగె!

జడవిచ్చి వింతగా జూకుకొప్పమరించి
యేది నీటనుచు నిన్నేలయడిగె!

పైడిముక్కెరదీసి పచ్చతళ్కు ధరించి
యేది లెస్సయనుచు నిన్నేలయడిగె!"

ఇట్టి ప్రశ్నలకుత్తరం బీకులేక
అర్థమెరుఁగని బండవిద్యార్థి రీతి
గుడ్లు నీవప్పగించిన గూఢదృశ్య
మొకటి, నాకంటఁబడెను లేవోయి, చంద్ర!

చంద్ర — శాంతా! శాంతా! నిన్ను బ్రతిమాలుకొనెద! నన్ను రచ్చబెట్టకుము! నీనే పాపము నెరుంగను. శాంతా! నీవు నాకుమిక్కిలి నేస్తురాలవు నా హృదయమును నీకడ దాపజాలను త్రికరణశుద్ధిగా నాదుస్థితి నిక వెల్లడించెద నాలింపుము.

చ. అనుభవశూన్యతన్ దొలుత నర్థమెరుంగగనేరనైతినే,
దినములు మీఁదవడ్డ కొలదిన్ విశదంబగుచుండె తారభా
వన నెలకొన్న ఘోరపరివర్తన, మయ్యయొ! శాంత! రేబవల్
కనులకు గూర్కురాదు, భయకంపితమయ్యెడు దేహమక్కటా!

శాంత — చంద్రా! బింకాలు విడిచిపెట్టి నిజం చెప్పడానికి ప్రారంభించావు... నీ హృదయానికి చాలా సంతోషపడుతున్నా.

చంద్ర — శాంతా! నా హృదయావేదన ఎంతని చెప్పుదును?

సీ. ఆమెచర్యల యంతరార్థంబు తెలియని
యట్లు నటింతునా? అదొకభయము!
తెలిసినరీతివర్తింతునా? యేమి సా
హసమొనరించునో? అదొకభయము!
తేటతెల్లంబుగా దెల్పి నీకిది తగ
దంచు వారింతునా? అదొకభయము!
వారింపకుందునా యేరీతి నెపుడేమి
ముప్పుట్టిమున్గునో? అదొకభయము?

తల్లిదండ్రుల విడిచి విద్యార్థమిటకు
వచ్చితిని, చిన్నవాడ, నే పాపమెరుగ—
పిట్టపిడుగువిధాన నీఘట్ట మొకటి
వచ్చిపడెనోర! నాతలవ్రాతయేమొ ? !

శాంత —చంద్రా! నీవల్ల తప్పులేదనే విషయం ఇప్పుడు విస్పష్టమయింది.

చంద్ర —శాంతా! నేస్తురాలా! సహృదయా! కర్తవ్యము ననుగ్రహింపుము.

శాంత —సరే. చెప్పనా ? వింటావా ?

చంద్ర —అవశ్యము.

శాంత —చంద్రా! తారవల్ల నీకు బాధతప్పిపోవలంటే ఒక్కటేమార్గం.

చంద్ర —ఎట్టిది?

శాంత — ఆమెకు నీమీదరోతపుట్టేట్టు చేసుకోవాలి.

చంద్ర —రోతయా నామీదనా? ...సరే కాని, ఉపాయము ?

శాంత —ఆడుదానికి మగవానిమీద రోతకలగటానికి ఒక్కటే ఉపాయముంది.

చంద్ర —ఎట్టిదది ?

శాంత —తనప్రేమను నిరాకరించి అన్యస్త్రీని ప్రేమిస్తే చాలు, ఆడదానికి అతుగ వానిమీద తప్పకుండా రోతపుడుతుంది?

చంద్ర —కాబట్టి నీ హితబోధ యేమని?

శాంత —ఒకవంక తారను నిరాకరిస్తూ మరోవంక అన్యస్త్రీని ప్రేమించు. ఆదెబ్బతో తారకు నీమీద రోతపుట్టుక తప్పదు ఆ రోతలోనే నీకు విముక్తికలుగక తప్పదు.

చంద్ర —మంచిదే కాని, నే నేస్త్రీని ప్రేమింపగలను? ఎవ్వరును గానరారే!

శాంత —(వెకిలిగా నవ్వుతూ) ఇంతవరకూ ఇన్నేళ్ళనుంచీ ఈ ఆశ్రమంలో నీ హృదయాన్ని ఆకర్షించగలిగిన స్త్రీ ఒక్కతెయూ లేదా ?

చంద్ర —అట్టిహృదయమొకటి నాకుండినగదా ఆవిషయ మెరుంగుటకు ?

శాంత —కఠినుడా ! జీవంలేని పాషాణప్రతిమాశిల్పమా నీ విగ్రహం ?

చంద్ర —కోపపడకుము శాంతా !—

గీ. ప్రేమయనఎట్టిదో నాకిదేమి తెలియు ?
నాప్రపంచము గురువు, గ్రంథములు, విద్య,
తార, నీ, వింతియేగాక తదితరము
నాకుఁ గనుపింపలే దిన్ని నాళ్ళు శాంత ?

శాంత —"ఇన్ని నాళ్ళు" అంటున్నావు—చంద్రా! ఇప్పుడిప్పుడు కనిపిస్తున్నదా నీకీ ప్రపంచం?

చంద్ర —కనుపించుచున్నది.

శాంత —ఏవిధముగా?

చంద్ర —బహుభయంకరముగా!—

శాంత — ఏమిటి! భయంకరంగానా! ప్రపంచమా! (పక్కున నవ్వుతుంది.)

చంద్ర — శాంతా! నీవుకూడా నన్ను నిరాదరించుటకు పూనుకొంటివా (కన్నీళ్లతో) కానిమ్ము. ఈక్షణముతో నాకును ఈయాశ్రమమునకును ఋణానుబంధము తెగినది శాంతా! నాతల్లిదండ్రులయొద్దకిప్పుడే పలాయన మొనరించెదను. దానితో నాబాధలెల్ల తప్పక నివారణకాగలవు శాంతా! సెలవు.

గీ. అమ్మ తారయటన్న నా కమిత భయము.
శాంత! నీకడ నా కెప్పు చనవు, ప్రీతి—
మరతు నామెను; నిన్ను నేనుమరువజాల
లతలవలె నల్లుకొన్న యుల్లములనకట.
త్రెంచుకొని పోవుచుంటి, క్షమించుశాంత!

(చంద్రుడు పోతూవుండగా శాంత అతణ్ణి గట్టిగాపట్టుకొని వణికిపోతూ)

శాంత — చంద్రా! చంద్రా! నీకు ఒకహృదయము ఉన్నదా? !దాల్లో ఒకమూల ఈమాత్రం తావుకూడా నాకు వున్నదా? ! చంద్రా! రాయిటు! ముఖం ఎత్తు! చూడు! చంద్రా! నన్నునీవు నిజంగా నమ్మావా? నమ్ముతావా? నమ్మగలవా!

చంద్ర—నిన్ను నమ్మకుందునా శాంతా!

శాంత—కాని, అమాయకుడా! నేను నమ్మదగిన స్త్రీని కాదు సుమా!

చంద్ర—ఎందుచేత?

శాంత—తారలో మొలకెత్తిన దోషమే నాలోకూడా తలయెత్తునేమో? ఎవరు చెప్పగలరు?

చంద్ర—శాంతా! నీ కట్టి తలంపు కలుగుటయే కల్ల. ఒకవేళ కలిగినను నేను సహించుకొందును.

శాంత—చంద్రా! జారిపోతున్నావా?

చంద్ర—కాదు. ఆమె నా తల్లి—నీవు నా సహాధ్యాయినివి. ఆమె గురుపత్ని—నీవు నేస్తురాలవు. ఆమె కోరిక లోక విరుద్ధము నీ తలపు లోక సహజము. అందుచేత సహానవాణవ కవకాశమున్నదని నా యభిప్రాయము.

శాంత—అటులేని, చంద్రా! నీవు నా సద్వర్తనంమీద సంపూర్ణ విశ్వాసం వుంచి, ఈ క్షణంనుంచి నేను చెప్పినట్లు నడుచుకుంటావా?

చంద్ర—అట్లే నడచుకొందును.

శాంత—మంచిది. ఆ తారకు నీమీద రోతపుట్టడానికై నేనొక గమ్మత్తు చేస్తాను.

చంద్ర—ఎట్టిదది?

శాంత—ఈ క్షణంనుంచి నీకు నేనే ప్రియురాలిగా నటిస్తాను. నీవు తప్పక తలవవు కదా!

చంద్ర—నా ప్రియురాలిగానా! స్వైరా!

శాంత—అంటే—నటించడంవరకే లే.

చంద్ర —మరి - నేనేమిచేయవలెను ?

శాంత —నీవూ నటించాలి.

చంద్ర —ఏవిధముగా ?

శాంత —నాప్రియుడిలాగ.

చంద్ర —గొప్పచిక్కు తెచ్చిపెట్టితివే !

శాంత —అదుగో ! అదుగో ! చంద్రా ! ఆ కొండెగాళ్ళు — లంబూజంబూలు నీమీదా నామీదా ఏవో చాడీలుచెప్పి తారను ఇటే తీసుకువస్తున్నారు. రా! ఇదె సమయం. మన్మథతంత్రములోవున్న మంత్రాలన్నీ ప్రయోగించితారకు నీమీద రోతపుట్టేటట్టు చేస్తా ! రా ! భయపడకు ! ఊఁ ! చూడు, నామాటలు అర్థంచేసుకొంటూ నాతోపాటు ఆడు ! నాతోపాటు పాడు!

ప్రేమతత్వంమీద శాంతా చంద్రులకు

## డైలాగు పాట (5)

పాటపాడుతూ శృంగారచేష్టలను నటిస్తూ ఇద్దరూనిష్క్రమణం.

---

## దృశ్యం - మూడు

అదే ఆశ్రమవనిలో.

లంబూ జంబూలు తోవచూపగా తార పరుగుతో ప్రవేశం.

లంబూ—అదుగో ! అదుగో ! చూడండి ! మీరేచూడండి !

జంబూ—చూడండి ! అద్దంవుంది—మొహంవుంది. అబద్ధం చెప్పవలసినంత అగత్యం మాకేంవుంది! చూడండి! ఎంత నిర్భయంగా విహరిస్తున్నారో చూడండి!

లంబూ—ఇవి పవిత్రమైన మునుల ఆశ్రమ మనుకున్నారో? పానశాల అనుకున్నారో?

జంబూ—అయ్యయ్యో ! పట్టపగటివేళ—అందరూ తిరిగేవేళ—

లంబూ—కలియుగం ఇవ్వాళే వచ్చినట్లుందిరా !

జంబూ—అమ్మా ! వీళ్ళను దండించకపోతే ఏం జరుగుతుందో తెలుసా ?

లంబూ—ఏం జరగడం ఏమిటి ? ఆశ్రమానికి భూకంపం వస్తుందిరా ! భూకంపం !

తార —అయితే, వటువులారా ! శాంతాచంద్రులు ఈరీతిగా ప్రవర్తించుట ఇదివర కెన్నడైనా మీకంట పడినదా ?

జంబూ—ఏమోనమ్మా ? ఈగొడవలన్నీ మాకేం తెలుసూ ? మీరు అడుపాజ్ఞల్లో వున్నాడుగదా అని అనుకున్నాముగాని చంద్రుణ్ణి ఇలా గజ్జెలగుర్రంలాగ విడిచిపెడతారని మే మెలా అనుకుంటాము ?

లంబూ—అదీగాక చంద్రుడి వయసెక్కడ? శాంత వయసెక్కడ? ఈవిపరీతానికి అవకాశం ఎక్కడ?

తార —అయితే లంబోదరా! వయస్సుతోపాటు మనస్సుకూడావికారం పొందుతూ వుంటుందనా నీ యభిప్రాయం ?

లంబూ—అయ్యయ్యో ! అలాటిప్రశ్న వేశారేమిటి? వయస్సు ముదిరినకొద్దీ మనస్సు కూడా గిడసబారి పోవాలమ్మా - దేహధర్మమంట అది.

జంబూ—అమ్మా! ఉదాహరణకు చెప్తాను - మీరున్నారనుకోండి. మీకు వయస్సు మనస్సూ సమగతిలో ఉన్నయ్ - కాబట్టి మీబండి జంట కోడెదూడల బండిలాగ జమాయించి నడుస్తుంది. గురువుగారు, బృహస్పతి భగవాన్లు వారు ఉన్నారనుకోండి, వారివయస్సు ముసలెద్దూ—వారిమనస్సు కోడెదూడా - అందుచేత, వారిబండి కుంటుతూ, పడుతూ నడుస్తుంది—

తార —ఇక నోరుమూయ్ ! - లంబోదరా ! నీవు సత్వరమే పోయి శాంతతో నేను రమ్మంటినని చెప్పి తీసుకొనిరా.

లంబూ—అమ్మా ! శాంత తప్పేఅంటూరా ఇదండా ?

జంబూ—చంద్రుడుకూడా శిష్యుడే నమ్మా.

తార —నోరుమూయండి లంబూ ! వెళ్లు.

లంబూ—చిత్తం. (లంబూ నిష్క్రమణం)

తార —జంబుకేశ్వరా !

జంబూ—అమ్మా ?

తార —మీగురువుల వారికి వయస్సెంత ?

జంబూ—మీకే తెలియాలి.

తార —ఊహించిచెప్పు.

జంబూ—బహుశా ఆరుపుష్కరాలు దాటివుంటయ్ అనుకుంటా.

తార —నా వయస్సెంత ?

జంబూ—నాకేం తెలుసు ?

తార —ఇది కూడా ఊహించిచెప్పు

జంబూ—మీవయస్సు రెండోపుష్కరం మూడోపుష్కరం సందున వుందనుకుంటా. కాని, ఎందుకమ్మా ఈవయస్సులభోగట్టా ?

తార —జంబూ! వయోభేదంవల్ల శాంతాచంద్రుల వర్తన విపరీతంగా కనిపిస్తే, మరి ఆకారణంచేతనే తారాబృహస్పతుల దాంపత్యంగూడా లోకానికి విపరీతంగా కనిపించ దంటావా ?

జంబూ—ఏమోనమ్మా !

తార —భయపడి చెప్పలేకపోతున్నావుకాని, జంబుకేశ్వరా !

ఉ. ఆలుమగండటన్న విధియందలి చిత్రముగాక, వృద్ధు ని
ల్లాలయినంతమాత్రమునయాత్మనశించునె? స్త్రీత్వమారునే?
పూలుగలట్టి తీవెయది వృద్ధపయఃపున్ బడి ప్రాకు గాక, ఆ
పూలపరిమళంబులు గుబుల్కొని పర్వవె యెల్లదిక్కులన్ !

లంబూ—(ఏడుస్తూ ప్రవేశించాడు)
జంబూ—అమ్మా! మనవాడికి శాంతచేతుల్లో మంగళహారతి జరిగినట్లే తోస్తుంది.
తార —ఏమిజరిగినది? ఇటుపు రానన్నదా?
లంబూ—(ఏడ్పుతోనే మళ్ళీ 'ఔ' నన్నట్లు తలఊపుతాడు)
తార —రమ్మని నీవు బలత్కారం చేశావా!
లంబూ—(ఏడ్పుతోనే మళ్ళీ 'ఔ' నని సౌజ్ఞ)
తార —అందుకని నిన్ను కొట్టిందా?
లంబూ—ఏడ్పుతోనే మళ్ళీ 'ఔ' నని సౌజ్ఞ)
తార —అడది కొట్టితే ఏడ్చేమగవాళ్లు ఆడదాన్నక్షంత్రిస్తే సత్తిన్నోయా కాదుకానే నరలోకం, అంతా ఈఆశ్రమంలోనే వుంది-ఇది మా స్త్రీజాతి దురదృష్టం. నడవండి! శాంతాచంద్రుల వ్యవహారం నేనే పరిష్కారం చెయ్యాలి! ముందు మీరు పొండి! నెమ్మదిగా నేనువస్తా!—

లంబూ—
జంబూ— } చిత్తం. చిత్తం

(లంబూ జంబూలు నిష్క్రమణం)

తార —(పెద్దనిట్టూర్పు విడిచి) అక్కటా! —

ఉ. ఊరక బింకముల్ పలుకు చుంటిని-అంతిమొగాని చంద్రుడా
తీరున శాంతతో బ్రియువిధిన్ విహారించెడి దృశ్యమద్దిరా!
ఘోరదురంతమైహృదయఘూర్ణనమున్ బొనరించి, దేహమున్
దారుణ కేలకీలికల దగ్ధమొనర్పంగ సాగెనక్కటా!—

(తార నిష్క్రమణం)

---

## దృశ్యం - నాలుగు

బృహస్పతి ఆశ్రమంలో వనాంతరం

శాంతా చంద్రుల ప్రేమవిహారం

డైలాగుపాట (6)

పాట చివర మొదలుకొని. తార" చంద్రా! అగు! శాంతా! చాలించు" అని చెప్పేమాటలవరకు షుమారు రెండునిమిషాల కాలం పట్టి ఆర్కెష్ట్రా మ్యూజిక్ జరుగుతూ వుండాలి. ఆ మ్యూజిక్ మీద శాంతాచంద్రులు ప్రేమనృత్యం చేస్తుంటారు.

డైలాగుపాట పూర్తికాబోయే ముందే

లంబూ జంబూలు ప్రవేశం.

లంబూ—ఏయ్ ! చంద్రా ! నిన్నే !

జంబూ—ఏయ్ ! శాంతా ! ఇదుగో ! ఇట చూడు! నిన్నే !

లంబూ—అమ్మగారు వస్తున్నార్రా !

జంబూ—మీమంచికోసమే చెబుతున్నాం. వినండి !

లంబూ—మీ యిద్దరూ యిలా చిలకా గోరువంకల్లాగ ఆడుతూవుంటే మాకుకూడా ఒళ్ళు జలదరిస్తుంది సుమా.

జంబూ—శాంతా ! చూడు ! నన్నుకూడా కాసేపు అలాగే ఆడించవూ ?

లంబూ—నన్నో ?

జంబూ—చంద్రా ! దయచేసి నువ్వోగంటంసేపు విశ్రాంతితీసుకో. నేనూ శాంతా ఆడుకుంటాము.

లంబూ—ఓకేయ్ !! ముట్టమొదట ఒళ్ళుజలదరించడం నీకా ? నాకా ?... నాకే అని ఇందాకే చెప్పేకా. కాబట్టి నేనేమొదట ఆడాలి

జంబూ—ఓకేయ్ ! అసలు సంగతి గమనించావా? మనంవీళ్ళకి కనపడడమూ లేదు-వినబడడమూ లేదు.

లంబూ—అయితే ఏంచేద్దాం ?

జంబూ—నువ్వేచెప్పు.

లంబూ—మంచిది. ఓకేయ్ ! ఇక ఒకటే కర్తవ్యం. అసలు శాంత మనకు లభించనపుడు, నకలు శాంతను సృష్టించుకొని ఆనందపడదాం. రా !

జంబూ—నకలు శాంత ఏమిట్రా నీ శ్రాద్ధం ? —

లంబూ—అంటే, నువ్వే శాంతవని నేనూ, నేనే శాంతనని నువ్వూ అనుకొని ఇద్దరం ప్రేమించుకుందాం రా !

జంబూ—ఓకేయ్ ? ఇదిచివరికి కటికి మేజువాణీ అవుతుందేమో ?-అయినా నమోనా చుద్దాం ఎలావుంటుందో !

ఇద్దరూ చేతులుపట్టుకొని ఒకరుచంద్రుడు లాగా ఒకరు శాంతలాగా సరిగ్గా వాళ్లకుమల్లే (అందవికారంగా) ప్రేమనృత్యం చేస్తుంటారు. ఈ దృశ్యం జరుగుతూవున్న సమయంలో

తార ప్రవేశం

తార —శాంతా ! చంద్రా !......మీరుకూడానా ! ఇదేమివిపరీతం ? ? లంబూ! జంబూ! లంబూ మిమ్మల్నే !... (ఎవ్వరికి వినపడడం లేదు) జంబూ ! లంబూ ! (గట్టిగా ఇద్దర్నీ చెరోక చరుపూ చరుస్తుంది )

జంబూ—
లంబూ— } అమ్మరోయ్ ! అమ్మగారు!

అంటూ పరుగెత్తుకుపోతారు.

తార —చంద్రా! ఆగు! శాంతా చాలించు !

శాంత —మీరా ?... ఎప్పుడువచ్చారు ?......క్షమించండి !...చూడలేదు.

తార —చంద్రా! అలిసిపోయావు కాబోలు, ఆశ్రమంలోనికి పోయివిశ్రాంతితీసుకో!

చంద్ర —(తలవంచుకొని వెళ్ళుతుండగా)

శాంత —చంద్రా ! వెళ్లవద్దు. (చేయిపట్టుకొని ఆపుతుంది)

తార —చంద్రా ! శాంత ఆపితే ఆగిపోయేస్థితికి వచ్చావా?

చంద్ర —(మౌనం)

తార —ఈస్థితి నీకు ప్రాప్తించి యెన్నాళ్లయింది ?

శాంత —చెప్పు...నీవూ నేనూఇలా సంచరించడం ఎన్నాళ్లనుంచిఅని నీతల్లిగారు ప్రశ్నిస్తున్నారు. భయమెందుకు ? నిజంచెప్పు.

చంద్ర —(మౌనం)

శాంత —అమ్మా! చంద్రుడి విషయం మీకు తెలియనిదేముంది ? వీడు మితభాషి. అదీగాక మిమ్మల్నిచూస్తే అమితభయం. అందుచేత మౌనం ధరించాడు.

తార —ఓహో !

శాంత —కాబట్టి చంద్రుడి బదులూ నాబదులూ నేనే జవాబు చెప్తా...అయితే... మీ ప్రశ్నయేమని ? ......... మరచిపోయా! .........ఆఁ......... ఈ వ్యవహారం మా యిద్దరిసందునా ఎన్నాళ్లనుంచి నడుస్తున్నది అని ప్రశ్నించారు. జవాబేమిటంటే ఇదిచాలారోజులనుంచి నడుస్తున్నది !

చంద్ర—పట్టిది. పట్టిది. ఇంకాకటినుండిరే.

శాంత —కంగారుతో ఒకటి చెప్పబోయి మరొకటి చెప్పకు ! అమ్మా! అసలు విషయ మేమిటంటే ఈకుర్రవాడు ఆరితేరిన వ్యభిచారిగాతయారయ్యాడు.

తార —ఆఁ ! శాంతా ?.........

శాంత —ఔనమ్మా ! చూపులకు ఇలాటి పెద్దమనిషి. చేష్టలకు ఇలాటి ధూర్తుడూ. పుట్టలేదు - పుట్టబోడు !

చంద్ర —అయ్యయ్యో! శాంతా! అమ్మగారికి నాపైన నిక్కమూగా కోపపుట్టునట్లే యొనర్చుచున్నావు కదా !

శాంత —అబ్బే ! అమ్మగారికి యెందుకుపుట్టాలి నీమీదకోప ! మగవాడవు-పదుచు వాడవు. నీ జీవితానికి నీవే కర్తవు నీ యీడులో వుండేవాళ్లంతా ఏమి చేస్తారో నీవూ అదేచేస్తున్నావు. వాళ్ళందరిమీదా లేనికోప నీమీద యెందుకుపుట్టాలి ? అదీగాక—

తార —చాలించు నీ ఉపన్యాసం...చంద్రా! వెంటనే ఆశ్రమంలోనికి వెళ్లు!... ఇది నా యాజ్ఞ ! ...వెళ్లు !...ఊఁ...

చంద్ర —(తలవంచుకొని నిష్క్రమించును)

శాంత— అమ్మా ! ఇలాంటి నిరంకుశత్వం మీకు తగదు.

తార —శాంతా ! ఇంతసేపు చంద్రుడున్నాడు కాబట్టి నేనేమీ అనలేదు. ఇకమీదు ఈ ఆశ్రమంలో ఇలాంటి మహాపాపం చేయనున్నామని నీకు శిక్షవిధిస్తున్నాను. ఈ ఆశ్రమంనుంచి వెంటనే వెళ్ళిపో.

శాంత —సరే. చంద్రుణికూడా తీసుకొని ఇప్పుడే వెళ్ళిపోతా.

తార —చంద్రుడు నీవెంట యెందుకు వస్తాడు!

శాంత —నాకోసం వస్తాడు.

తార —సిగ్గుమాలినదానా ! ఇంత గడసరిత్తెవుగా ఎప్పుడు తయారయ్యావు?

శాంత —అమ్మా ! నాకుగూడా ఒకభర్తవుంటే నేను భయపడాలి. నేను అవివాహితను. అతడు బ్రహ్మచారి. కాబట్టి నేను చేసేది వ్యభిచారం అనడానికి ఎవరికి గుండెలున్నయ్!

తార —చాలించు నీఉపన్యాసం. ఈక్షణంనుంచి ఈఆశ్రమంలో నీముఖంచూపించవద్దని ఆజ్ఞాపించా. పోయిక !...చంద్రుని ప్రసక్తి నీ కనవసరం. వాడు నీవెంటరాడు. రాదలచినను నేనురానీయను. తెలిసిందా! పో! ఈక్షణంపో!

శాంత —చంద్రుడిపై ఇంతఅభిమానం మీకెందుకు ?

తార —ఆప్రశ్న నీ కెందుకు?

శాంత —మరి, అదేగా మనకిద్దరికీ ఇప్పుడు కావలసింది ?

తార —వాడు మాశిష్యుడు. తలిదండ్రులు వానిని మాకప్పగించారు, మళ్ళి యధావిధంగా వారికప్పగించేవరకూ అన్నిబాధ్యతలు మావి. తెలిసిందా ?

శాంత —మీ బాధ్యతలను ఇంతటి పట్టుదలతో నిర్వహిస్తున్నందుకు నిజంగా మిమ్మల్ని అభినందించాలి కాని, అమ్మా ! చంద్రుడికి ఈడువచ్చింది. అంటే మీకు కోపం వస్తుందేమో, కాని-

చ. మగడతివృద్ధు, నీవు సుకుమారపు లేతవయస్సుదాన, వీ
జగతికి మంచిచెడ్డల విచారముతక్కువ, చంద్రుబోలు రూ
పగరిమ గలట్టి యావనుడు సంతతమింట వసించియున్న, నీ
తగవులమారి లోకము వృథా యపనిందలు మోపకుండునే!

తార —శాంతా! లోకం మోపినామోపకపోయినా ముందునీవేమో పేటట్లున్నావు.

శాంత —క్షమించండి! మీరు అన్ని విద్యలూ చదివారు. నేనుఏవిద్యా చదువలేదు. కాని, భర్తాసంసారంఅనే అవరణలోమీరున్నారు. ఏఅవరణాలేని మైదానంమీద నేనున్నాను. స్వేచ్ఛఅంటే యేమిటో. దాన్లోవున్న మాధుర్యం యెట్టిదో నాకుతెలుసు—మీకుతెలియదు. అందుచేత మీ మీద-మీరున్న దుర్భర పరిస్థితులమీద-మిమ్మల్లను చలాచలంగాకుదిపివేస్తున్న భయంకర సమస్యలమీద, నాకు హృదయపూర్వకమైన సానుభూతి, నిర్వేదం, జాలీ కలిగి ఇవ్వాళ ఈప్రసంగం యెత్తాను.

తార —శాంతా! శాంతా! నామీద నీకు నిజంగా జాలికలిగిందా!

శాంత —అమ్మా! నేనూ ఆడదాన్నే! నాకూ ఉంది హృదయం.

తార —క్షమించు! శాంతా!... నేస్తురాలా!... ఇలారా! (చేతులు చాచింది. కన్నీళ్లు ఉబుకుతున్నయ్)

శాంత —అమ్మా!

తార —సఖీ!

ఇద్దరూ ఒకరినొకరు గాఢంగా కౌగలించుకొంటారు.

తార —శాంతా! ఇక నీవద్ద దాచను!...దాచలేను!...

శాంత —ఏమిటమ్మా అది?

తార —చెప్తే నామీద నీకు రోతపుడుతుందేమో!

శాంత —అమ్మా! నాయందు విశ్వాసంకలగలేదా!

తార —శాంతా! నీకంటె నాకు ఆప్తులు లేరు. చెప్తావిను!—

ఉ. చప్పుడు సేయకుండఁ గడుచల్లగఁ బ్రాకుచువచ్చి, నిద్రమై
దప్పిన వాని చేలముపఁ దాఁ దలమారిచి, కాటువేయు నా
సప్పమురీతి, నామనసు నందున నొక్క దురంతభావ మె
ట్లెప్పుడు కాలువెట్టునో? సఖి! విషమున్ బ్రసరించె నక్కటా!

శాంత —అమ్మా! ఆడుదాని జీవితమే అఘ్యాన్నవు జీవితం. అందులో ఇలాటి ఘట్టాలు తటస్థించినపుడు ఆబాధ మరీ దుస్సహ మవుతుంది. అమ్మా! ఏం జరిగింది! అసలు సంగతియేమిటి?

తార —శాంతా!...ఏమని చెప్పుదును?

మ. క్రమమున్ దప్పితినంచుఁ జింతపడనా? కానిమ్ము నాత్రోవ యు
క్రమమో నక్రమమో? యధర్మమొ నధర్మంబో? సుధాస్వర్గమో?
[illegible] ప్రియా
ర్థము లోకమ్మును ధిక్కరింతు! ననిధైర్యంబూననా! అక్కటా!

శాంత —అమ్మ! 'ప్రియార్థము లోకమ్మును ధిక్కరింతు' అని అన్నారు. ఎవరమ్మా ఆ ప్రియుడు?

తార —(ఉలికిపడి) ప్రియుడా! (నెకిలినవ్వు నవ్వుతూ) నాకా? ప్రియుడా! పాపము శాంతించుగాక! (నాకులదేవతలు నన్ను రక్షింతురుగాక! నిశ్చల భావాన్ని ఆకుప్తు [illegible]ంటూ) శాంతా! నాకు ప్రియుడులేడు! భర్త ఉన్నాడు! ఆయనపేరు బృహస్పతి!

శాంత —అమ్మా! మీ హృదయాన్ని మీమనస్సును ఈవిధంగా మందలించుకుంటూ వింటేగాని, ఈ మాటలు లోకాన్ని ఉద్దేశించి చెప్పినవి కావు. సరే

పోయిందు. ప్రియశబ్దము భయంకరంగా వినిపిస్తున్నది. కాబట్టి ప్రోని రాజా. ఇక ఆ ప్రియుడు యెవ్వరో చెప్పండి.

తార —ఏ అప్రియుడు?

శాంత —'ప్రియార్థము' అని సూచింపబడిన అతడే !

తార —అతడా? చెప్పనా? ఇలారా! చెవిలో చెప్తా (శాంత దగ్గరకు వస్తుంది) ఆ వ్యక్తిపేరు—శాంతా ! మంజు మంజులము! కర్ణామృతము! సుధామధురము !...అతనిపేరు...... (ఇక్కడ బృహస్పతి అకస్మాత్తుగా వచ్చి నిలబడ్డాడు. అతణ్ణి తార చూచి ప్రసంగం గభాలున మార్చివేసింది)...బృహస్పతి భగవానులే! జగదేక బ్రహ్మజ్ఞాన సంపన్నులే! తారానయన చకోర చంద్రులే! ...

బృహ —ఆనందము ! మహదానందము !.... తారా ! నీ నిరంతర భర్తృసంస్మరణాసక్తి నిజముగా త్రిజగద్వంద్యము.

తార —సాధూ ! వందనములు ! ఎప్పుడు వచ్చారు !

శాంత —భగవన్ ! ప్రణామములు.

బృహ —తారా ! చంద్రుడేలనో నేడుఅధ్యయనమునకురాలేదు. వాడెందున్నాడో చూచిరమ్మని శిష్యుల బంపితిని. పెద్దతడవు రోదించిన వానివలె ముఖము పొంగియున్నదనియు, ఏ కతమ్ముననో దనలోదాను మిగుల కగలెందు చున్నాడనియు వారు చెప్పినారు.

మ. నిముసంబేనియు నూరకుండకు, మహోనిష్ఠన్ సమస్తాగమా
ర్థములున్ శాస్త్రరహస్యముల్ గణితతర్కన్యాయసిద్ధాంతముల్
శ్రమతో నభ్యసనంబు సేయు, నితరోల్లాసంబులే లేవు చం
ద్రముడౌరా! యిటులేల డీల్పడియె? తారా! నీవు చెప్పంగదే !

శాంత —భగవన్! నేం చెప్పనా ? నిన్న వాడూ నేనూ పందెం వేసుకొని చెరో పద హారేసి అప్పడాలూ తిన్నాం. నాది మొద్దుశరీరం కాబట్టి కడుపులో కుట్టు చెయ్యలేదు. వాడిది సుకుమార శరీరం కాబట్టి అప్పడాలపిండి పేగులకు పట్టుకుని అజీర్ణవునొప్పితో పొద్దుటనుంచి బాధపడుతున్నాడు.

బృహ —అదియా విషయము ?

శాంత —చిత్తం భగవన్! వాడికి ఆముదం ఇద్దామా సేపాళంమాత్ర వేద్దామా అని ఇద్దరమూ ఆలోచించుకుంటూవున్నాము. మా ఆలోచన తెగక, మీ సలహాప్రకారం చెయ్యాలని నిశ్చయించుకొని మీదగ్గరికే బయలుదేర పోతు న్నాము. ఇంతలో మీరు రావచ్చేశారు. అయితే భగవన్! ఆముదం శ్రేష్టమా! లేక సేపాళం ప్రశస్తమా ?

బృహ —రెండును ప్రశస్తములే.

శాంత —మరి కర్తవ్య మేమిటి భగవన్ !

బృహ —లంఘనము ! లంఘనము ! "లంఘనము పరమౌషధమ్" అని ఆయుర్వేద ప్రమాణము.

శాంత —దివ్యవాక్యం ! దివ్యవాక్యం ! అమ్మో ! విన్నారా! వాడెంత రుచ్చేసాసరే ఇవ్వాళ ఏమీ తిననియ్యి వద్దు సుమా !

(లంబూ జంబూలు పరుగుతో ప్రవేశం)

లంబూ—వందే గురుదేవా !

జంబూ—నమస్తే భగవన్ !

బృహ —ఎందుకురా ఇంత ఆత్రము ?

లంబూ—వస్తున్నది గురుదేవా ! మన ఆశ్రమం వైపుకే వస్తున్నది.

బృహ —ఏమది ?

జంబూ—విమానం గురుదేవా ! విమానం !

బృహ —
తార —
శాంత — } విమానమా ?!

లంబూ—
జంబూ— } అదుగో ! అదుగో ! చూడండి.

(అంతా ఆకాశం వంక చూస్తారు)

బృహ —ఔను. అది ఇంద్రలోక విమానము. తారా! శిష్యుడగు మహేంద్రుడుగాని అతని సందేశహరులుగాని వచ్చుచున్నారేమో? అతిధిపూజకై మనమందు సిద్ధపడి యుండుట మేలుకదా! తారా! రమ్ము! (తారతో వెళ్ళుతూ) శాంతా ! శిష్యులారా ! మీరుకూడా సత్వరమే రండు.

(తారతో బృహస్పతి నిష్క్రమణం)

లంబూ—శాంతా !

జంబూ—బృహస్పత్యాశ్రమకాంతా !

లంబూ—ఆడుకోవే మాతో రవ్వంత ?

జంబూ—ఎందుకే కోపం నీకింత ?

శాంత —ఈ కోడెదూడలకు వయస్సు గిడసబారిపోయి, ఏం చెయ్యాలో తెలియక వెర్రిగంతులు వేస్తున్నయ్ ! ...అయితే బ్రహ్మచారి మర్కట శిరోమణులారా! మీకు నాతో ఆడుకోవాలని వుందా !

లంబూ
జంబూ } ఔను, ఔను.

శాంత —నాతో ఏముంది ?

లంబూ
జంబూ } సుఖం ! సుఖం !

శాంత —ఓహో! సరే! మీసుఖానికి మీకూ మళ్ళీ నేనెందుకు అడ్డంరావాలి? సరే కాని, నాకూ ఒక సుఖం కావాలి—ఇస్తారా?

లంబూ—ఇస్తా.

జంబూ—వాడిమొహం—వెర్రివెపకాయ! వాడికేం తెలుసు! శాంతా! నేనేయిస్తా

లంబూ—కాదు, నేనే యిస్తా.

శాంత —మీ యిద్దరూ కలిసే ఇవ్వాలి.

లంబూ—సై.

జంబూ—సై.

శాంత —సరే. నా ముద్దుల యెద్దులారా! అదిగో ఒకబండి! దానికి ఎద్దులు లేవు. ఎక్కాలని నాకు చాలా కుతూహలంగా వుంది. మీరే ఎద్దులై దాన్ని లాగండి— నేనే గమ్మత్తుగా కూర్చొని తోలుతా? ...

లంబూ } (ఒకరి మొహం ఒకరు మాచుకొని, చివరకు)
జంబూ } సరే! అలాగే! పోదాం!

శాంత —ఆనందం! సరే... ఇక్కడే ఉండండి! ఇప్పుడే మళ్ళీ వస్తా.

(శాంత నిష్క్రమణం)

లంబూ— }
జంబూ— } (హిహిహి అంటూ పిచ్చిఆనందంతో నవ్వుకుంటూరు)

లంబూ—ఒరేయ్! నరవాహనం ఎక్కాలని ఇంత కుతూహలం ఎందుకు పుట్టిందో దీనికి?

జంబూ—ఒరేయ్! మనలోవున్న గొప్పతనం మనకే తెలియుట లేదుగాని, మనల్ని చూస్తేచాలు ప్రతిస్త్రీకి ఇలాంటి సుకుమార భావాలే స్ఫురించి తీరాలి!

లంబూ—మరి, మనల్ని ఎద్దులారా కోడెలారా మధ్యేమధ్యే మర్కటములారా అని కూడా సంబోధించిందే దానికి అంతరార్థమేమిటి?

జంబూ—అదే-అందులోనే వుందిరా స్త్రీహృదయరహస్యం! చూచావూ! స్త్రీలల్లో నాలుగు జాతులున్నాయని జంతుశాస్త్రకారులు పరిశోధన చేసి చెప్పారు మనఅమ్మ తారాదేవి, సర్వశుభలక్షణ లక్షితంబైన యీపద్మినీజాతినారీమణి! చూడు, అకుడ్డిమహారుషి-అవేపచెట్టుకింద గుడిసెలో వున్నాడే— ఆయన భార్య, నీసలైవ శంఖినీజాతి! మరి, ఏటిఒడ్డున, ఎప్పుడూ గార నూనేతో నిండి, తైలభాండంలో అప్పుడే ముంచి తీసిన వత్తివలె పితపిత లాడుతూ వుంటాడే ఆ గూని మహాముని—ఆయనభార్య ఒకటోరకంహస్తిని. ఇక మనశాంత-మన హృదయ అయస్కాంత-అశ్రమం మొత్తంమీద చిత్తినిరా చిత్తిని!

అప్పుడు ఒక గడ్డిమోపు మూటతోనూ, చేతిలో ఒకచెన్నాకోలతోనూ శాంత ప్రవేశం. లంబూజంబూలకు అర్థంకాక తల గోక్కుంటూ

న్నారు. శాంత గడ్డిమోపు విప్పి వాళ్ళముందు గడ్డి వేస్తూ, చెర్నా
కోలతో వాళ్ళను కొడుతుంది—

శాంతా లంబూ జంబూలకు డైలాగు పాట (7)

---

## దృశ్యం - అయిదు

నారదుడు - ప్రవేశం

నార —హాహాహా ! అనుకొన్నంతయు నైనది.

మ. పదియున్నాలుగు దీర్ఘవర్షములు స్తబ్ధంబైన తారాపతీ,
మదనోన్మాదపు టగ్గికొండ, వృథుకంపాగుంఫితంబై, బదా
బదలై ప్రస్సెడి వేళవచ్చె ! నిక నా ప్రజ్ఞన్ని యోగించి కూ
ర్చెద పోరాటము, నందనందన ! జయశ్రీ వేగ సంధింపుమా !

వహ్వ ! ఇంద్రుని యాహ్వానము... మాతలి యాగమనము—బృహస్పతికి దేవలోక ప్రయాణము... తారకుచిరవాంఛితవీకాంతము... ఇంకేమి కావలయును?. మన్మథునకు కనకాభిషేకము !... అనంతరము నా కలహకార్య కలాపము... హాహాహా!... కాని, ఈఘట్టము నాధ్యాంముగా ఏ విధమైన కలహమును లేవనెత్తదగును?... దేవదానవులకు ముడివెట్టుదునా ?... వలదు. అది అనవసర దారుణ రక్తపాతమునకు హేతువగును... ఔను !... మంచి సమయమునకు జ్ఞప్తికి వచ్చినది. తనయొద్ద నుండిన మృతసంజీవనిని కచుని ద్వారా అపహరించినది మొదలు, శుక్రుడు బృహస్పతిపై కారములు మిరియములు నూరుచుపగదీర్చుకొను వెరవుకై వెదకుచున్నాడు భళిరే! ఉపాయము స్ఫురించినది. ఇక నా కలహాబుభుక్షవృత్తిగా సాపశమించు సమయము ప్రాప్తించినది. కృష్ణా! ఆర్తజనావనా! నీ యాశ్రితులకు ఎందును ఏకొరంతయును గలుగ నేరదనుట నిశ్చయము.

నారదుని పాట

---

# అంకం మూడు

## దృశ్యం ఒకటి

### బృహస్పతి కుటీరంలో

బృహస్పతి కృష్ణాజినాసీనుడై జపమాల తిప్పుతూ వున్నాడు. మరోవైపు - ఆసనం మీద మాతలి కూర్చొనివున్నాడు. అతని కాళ్ళుపళ్ళెంలో ఉన్నయ్. ఒక కలశంతో శాంత నీళ్ళు పోస్తున్నది. తారకాళ్ళు కడుగుతున్నది.

తార —శాంతా!

శాంత —అమ్మా!

తార —పూజామందిరం లోకి వెళ్ళి పూలకరండం తీసుకు రా

శాంత చిత్తం.

(శాంత నిష్క్రమణం)

బృహ —ఎవరక్కడ?

లంబూ —(ప్రవేశించి) ఆజ్ఞ యేమి గురుదేవా?

బృహ —నీ సహపాఠి జంబు కేశ్వరు డెక్కడ?

జంబూ —ఇక్కడేవున్నా గురుదేవా అంటూ (ప్రవేశము)

బృహ —శిష్యులారా! ఈయన మహాభాగుడు - దేవేంద్రసారథి - మాతలి. ఈయన రాకచే మన యాశ్రమము నేడు నిక్కముగా పునీతమైనది. వీరియాగమనమునకు స్మరణచిహ్నముగా మీకెల్లరకు నేడు అటవిడుపు నొసంగుచున్నాను. మీరేగి శిష్యుల కెల్లరకీ శుభవార్త నెరిగించి యధ్యయనములు చాలించి క్రీడావినోదములతో నానందించుడు పొండు.

లంబూ
జంబూ } మహాభాగ్యం గురుదేవా!

(లంబూ జంబూలునిష్క్రమణం)

(శాంత పుష్పకరండంతో ప్రవేశం)

తార —(కరండంలోని పువ్వులతో మాతలి కాళ్ళను పూజిస్తూ పూజాగీతం పాడుతుంది). (8)

మాతలి—సుమంగళీభవ! దీర్ఘసుమంగళీ భవ!

తార —తరించితిని. ఇంద్రసారథి! ధన్యజీవితనైతిని.

(నమస్కరించి తార శాంతతో నిష్క్రమణం)

మాతలి—దేవశశిచంద్రా! సాఫల్య తేజో రాశియగు తారాదేవి కిభర్తలగుటచే మీకీర్తి మరింత శోభ ఘటించె.

బృహ — మాతలీ ! నీ యభివాదనమునకు కృతజ్ఞుడను. ఇక నింద్రలోకము నందలివిశేషము లెట్టివో చెప్పెదవా ?

ఏమనె పాకశాసనికి ? ఏమనె సర్వసుపర్వకోటికిన్ ?
ఏమనె యాసుమంగళికి శ్రీశచికిన్ ? సుఖుడే జయంతుడు
ద్దామ పరాక్రముండు, వనితాజనతానవమోహనుండు ? నీ
కామితమేమి ? రావగిన కారణమేమి ? వచింపు మాతలీ !

మాతలి — అష్ట దిక్పతులు సేవింపగా నఖండసుధర్మయం దాసీనుడై జగజ్జాలంబులు శాసించు మీ ప్రియశిష్యుడు మహేంద్రుడంపగా వచ్చినాడను. అచ్చట నెల్లరకు కుశలము, బృహస్పతీ ! అఖిల విద్యావాచస్పతీ !

మ. క్రతువాకండొనరింపగా మదిని సంకల్పించియున్నాడు, తత్
క్రతువధ్వర్యము నెల్లదావక భుజస్కంధమ్ముపై బెట్టినా
డతి శీఘ్రమ్మున మిమ్ము దోడ్కొని రమ్మన్నాడు మీశిష్యు, డో
యతిచంద్రా ! యరుదెంచి యాతని కభీష్టావాప్తి సంధింపవే !

బృహ — మాతలీ ! శిష్యుని సందేశమున కానంద భరితుడనైతిని. అతని మహదాశయము సత్వరమే ఫలించుగాక.

మాతలి — భగవన్ ! రాబోవు పూర్ణిమయే క్రతు సుముహూర్తము. కాలమవ్యవధిగా నున్నది. క్రతు నిర్వహణమునకై సేయందగు కార్యకలాప మంతయు మీ రాకకై యెదురు చూచుచున్నది. కాబట్టి మిమ్ము నేనే దోడ్కొని రమ్మనుచు నన్ను విమాన సహితముగా బంపినాడు.

బృహ — మంచిది. అట్లేయగుగాక ! మా యింటను నా తిథ్యమును స్వీకరించి ప్రయాణ శ్రమమును గొంత యుపశమించుకొని యీ సాయంతనమే నన్ను తోడ్కొని పోవుదువు గాక. రమ్ము ! ఈవార్తను తార కెరింగించి, ఆమె నొడంబరచి పోవుటకై యత్నింప వలసి యున్నది. అక్కటా ! తారా !

చ. అరనిముసంబు నన్ను విడనాడగనోర్వవు ముద్దురాల ! నా
చరణ సరోరుహార్చనయె జన్మకు సత్ఫలమంచు నమ్మినా
విరువురమధ్య గల్గిన నయో విపరీతము లేశమాత్రమే
నరయగలేని బేల వకటా ! యెటు నిన్విడి పోవనేర్తునో !

మాతలితో బృహస్పతి నిష్క్రమణము

## దృశ్యం - రెండు

బృహస్పతి కుటీరములో మరోవైపు

చంద్రునిమీద ప్రేమనుండి తప్పించుకు పారిపోదామని ఊహించి, తార, తానుకూడా ఇంద్రలోక ప్రయాణమునకు సిద్ధపడుతున్నది. మానరాగం తీస్తూ పెట్టెబేడా సర్దుకుంటున్నది. పాట (9)

తార —(సర్దుతూ) లంబూ ! లంబూ !

లంబూ—(ప్రవేశించి) అమ్మా ! ఏమి టాజ్ఞ !...... ఇదేమిటి ? ఈ ప్రయాణ సన్నాహం ఎక్కడికి ?

తార —చూడు ! ఆ...వట వృక్షానికి అరగట్టిన అరటి నారచీర తీసుకురా! తొందరగా పో ? ఊఁ.

లంబూ—చిత్తం. చిత్తం (నిష్క్రమణం)

తార —(మళ్ళీసర్దుతూ) మరచిపోయా! ఒసేయ్ జంబూ! జంబూ

జంబూ—(ప్రవేశించి) అమ్మా ! ఏమిటాజ్ఞ!—...ఇదేమిటి? ఈ ప్రయాణసన్నాహం ఎక్కటికి?

తార —చూడు! ఆ...తోటలోనికి పోయి కొన్ని వ ౬లూ జాజులూ పొగడలూ కోసుకురా ! తొందరగా రావాలి సుమా !

జంబూ—చిత్తం. చిత్తం (నిష్క్రమణం)

తార మళ్ళీ సర్దుతూ) శాంతా ! శాంతా!

శాంత (ప్రవేశిస్తూ) అమ్మా ! పిల్చారానన్ను ?.......ఏమిటీ సన్నాహ మంతా ఎక్కటికి మీ ప్రయాణం ?

తార శాంతా ! నాకే జయం ! నీకే పరాజయం !

శాంత —అసలు గొడవ యేమి టమ్మా !

తార —నీవు వినలేదా?... శాంతా ! యజ్ఞం ఇంద్రుణ్ణి చెయ్యబోతున్నది.

శాంత —ఏమిటి? ! ఇంద్రుడు యజ్ఞం చెయ్యబోతున్నాడా ? యజ్ఞం ఇంద్రుణ్ణి చేయబోతున్నదా ?

తార —మాతలి వచ్చాడు చంద్రుణ్ణి రమ్మన్నాడు. నేనూ వెళ్ళిపోతున్నా !

శాంత —మాతలి చంద్రుణ్ణి రమ్మన్నాడా ? !

తార —చంద్రుణ్ణా ! ...కాదు ! పొరపాటు ! నా భర్తగారిని...

శాంత —అయితే?

తార —అయితే యేమిటి ? ! ఇంద్రలోకానికి నేనూ భర్తగారితో వెళ్ళిపోతా. ఆయన వద్దన్నాసరే వెంటపడతా.

శాంత —వారు రమ్మన్నారా !

తార —ఎవరు ?

శాంత —మీ భర్తగారు.

